# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1958

సంపుటము 35 · . సంచిక 9

విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1958

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

* గతసంచిక తరవాయి *

హారినీలస్థగితావనీతలమునం దందాలకందమ్మునై
వరబృందావనవాటికన్ వరమశోభా పేటికన్ దృశ్యమౌ
హారనానామణిమండపాగ్ర విబుధోద్యత్ తోరణమాలమ్మునన్
బరమమ్మైన యొయారి మామక వచో మత్తేభ సంచారిణీ.

శిరమున్ దూగెడు కేకిపింఛియుముతోఁ జెల్వై కనద్రత్నసుం
దర కోటీర విచుంబి తాగ్ర లలితోద్యత్కుంతలాక్రాంతమై
స్ఫురదానీల విలోలఫాలదలకస్ఫూర్జల్లలాటేందు సుం
దరమై, శ్రీ శరదిందు బింబరుచి చందం బొప్ప నెమ్మోమునన్.

దళదంభోజపలాశలోచనము సుద్యత్పక్వ బింబాధరా
కలితస్మేర శుచిస్మితాకలిత తద్దంతావళీకాంతి సం
కులితాకాంబర, బిందుపాండురలసద్గండస్థలీలోలకుం
డలముల్ వాత్రిక మంజరీ మధుర కర్ణ శ్రీక సుశ్లోకముల్.

ఉరమై కుంద్రశతమ్మునుం గలిగి యొంతో యొప్పు ముక్తావలీహా
ర రుచిం గుల్కెడు కంఠదేశ మటుపై రమ్యేంద్రనీలావనీ
ధరరోచిన్ జితమ్ము సేయు పరమోదార ప్రభాపూర మ
వ్వరలక్ష్మి శుభమందిరాయిత మహోవక్షఃస్థలాద్రిముల్.

చరణాబ్జమ్ముల నానఖస్ఫురణ మక్రాంతంబు జీరాడుచున్
వరభోగీంద్ర సమానదోర్యుగమునన్ వాసించి వ్రేలాడుచున్
వరవస్త్రాభము దట్టమై మెఱుపుదీవం దాల్చు చందంబు దో
వ్వరహేల్ ఫుల్లవనామలస్రజము శోభల్ నించు సౌందర్యమున్.

మణిమత్కంకణ కాంతిమాంసలము, శుంభత్ఫుల్లపద్మారుణా
రుణ, మక్రాంతనఖాశ్రితోద్ధరణమై రూపించుహస్తద్వయిన్
గణుతింత్ రత్నమయాంగుళీయకవిభా కల్యాంగుళుల్ వేణుపూ
రణమునం జేసి యశేష జీవుల మనోరాగశ్రుతుల్ గాంచుచున్.

ఉదరోద్యద్ద్యుతినిమ్నగాలహరియై యొప్పారు నూగారు ను
న్నదగోపీ నయనానుకర్షణ సునిమ్నంబైన యన్నాభి యిం
ప్పిదమై బంగరు నీరువన్ దొలంకు నాపీతాంబర శ్రీ ప్రభా
మృదులమ్ముల్ మఱి యూరువుల్ గులుకు నామేలైన సౌభాగ్యమున్.

లలిత శ్రీమణినూపుర శ్రుతిజటాలంబైన జంఘాయుగ
మ్మలఘుస్పర్థి ముఖస్థ దంతివరరత్నాగ్రైక జంఘాలమం
జుల జంఘాయుగ దివ్యవైభవమునై శోభిల్లు చిద్బింబమున్
కులిశమ్మంకుశమంబుజమ్ము మఱిశంకున్ జక్రమున్ గేతన
మ్ములు రేఖల్ గులుకంగ కోమలములై ముద్దుల్ పిసాళించు మం
జులముల్ పాదతలంబులున్ వెలుఁగు మేల్ సొంపున్ నిగారింపునున్
దోలుకన్ బ్రహ్మశివాది దేవమకుట స్తోమాగ్రరత్నప్రభా
కలిత శ్రీనఖ చంద్రికావిదళిత క్షోణీజనక్షోభమై

చెలువౌ పాదయుగమ్మునుం గల కృపాశృంగారమాకారమున్
గలలో నిద్దురలోన మేల్కొలుపులో గన్గొందుగా కింటిలో
వెలి రాదారుల దారులం దదియ యో విశ్వేశ! నీమూర్తి క
న్నులలోఁ గట్టిన యట్లు చిత్తమున నెంతో హత్తినట్లయ్యెడిన్.

నవఘన నీలిమద్యుతి కనన్నమనీయ మశేషవేదవై
భవకమనీయ మాసాబంగు పావగతిం బడిపోవు నన్ను నం
భవ మిదియౌను గాదనక మక్కువ కన్నులనేని యబ్బి మా
నవ పరమాణువున్ నను సనాథుని జేయుచుగాక యివ్వడే.

హరి! నీకున్ బ్రణమిల్లి కోరెదనురా హా! అంజలింబట్టి నే
వరమీ యొక్కటిగాఁగ నొక్కటి ప్రభూ! వద్దెందునున్ జన్మ, మీ
శ్వర! పుట్టింతువొ భూమి దున్నకొను నవ్వారింటఁ బుట్టింపు సుం
దర గోవిందపదారవింద మధుమత్తంబైన చిత్తమ్ములో

అమృతస్యంది వచోవిలాసమును నావందించినా వైన! స్వ
ప్నమునం దైనఁ దలంప నీకృప యహంభావాన సిగ్గింతలే,
దమిత మ్మాయపరాధమున్ గనక నన్నాత్మీయుంగా గొన్న నీ
కు మఱేదీ దయసాటి? మిత్రులను, నాకున్ సాటి యేదీ ప్రభూ!

## కరుణాలహరి

పాతాళంబున కేగుమా సురపురిన్ పాలింపుమా మేరువున్
బాహూలోద్గతి నెక్కుమా జలధులన్ బాహుద్వయిన్ దాటుమా
చేతన్ శక్తములైన యాశలవి నిశ్శేషమ్ముగా ఏడవో
భూతవ్యాధిజరాజ్వరాహత! సుఖంబున్ గోరితేనిన్ మదిన్,
ప్రీతిం గృష్ణరసాయనమ్ము గొనుమా! వేరే శ్రమ మ్మేటికిన్

పాపమహీధరమ్ములకు వజ్రము, జన్మ రుజాభిభూత సం
తాప సుసిద్ధభేషజము, 'దంభ' తమఃపటలార్క బింబమున్
వ్యాపృత దుఃఖభూరుహ దవాగ్నికలాపము! 'కృష్ణ' నామమా
హా! పరనిర్వృతి ప్రకట సాధకపాటము వోల్చు నున్నతిన్

ఘనవిమతాటవీ శిఖ శిఖావితతిన్ వికలత్వ మొంది నా
మన మిటు మాధురీ పరమ మందిరమందు ముకుంద ముగ్ధ మో
హనవదనేందుబింబమున నంచిత చారు చకోరవృత్తి చే
ననిమిషభావ మొంది యమృతాప్లుతమై విలసిల్లుఁ గావుతన్

అమరతరంగిణీ పులినమందు సుఖాసనముండి కన్నులం
దమరిచి యోగముద్ర, విషయమ్ము లడగ్చి, హరించిలోని సం
తమసము సత్సుఖాత్మక సుధారస నిర్ఝరి నన్నవాంబుదో
త్తమరుచిఁ జిత్కళన్ మునిఁగి ధన్యుఁడ నౌటది యెన్నఁడో కదా!!

"మీ పేరు?"

"విశ్వేశ్వరరావు"

"కాలం పాగిపోతోంది అనే విషయం ఇంతకు ముందు మీ కెప్పుడైనా స్ఫురించిందా?"

"స్ఫురించకుండా ఉండటానికి అదేం కొత్త సంగతి కాదు గదండీ?" కొంచెం నవ్వుతూ అన్నాడు విశ్వం

"అప్పుడు మీ భావాలు ఎలా వుంటాయో చెప్ప గలరా?"

"నిన్న, ఇవాళ, రేపు—ఇదే కదా కాలం అంటే, అనిపించేది నాకు ఒక్కొక్కప్పుడు కాలం మీద ఏమైనా కవిత్వం రాద్దామని ఉంటుంది కాని సరైన భావాలు రాకపోవటంవల్ల రాయలేదు"

"మీ వయసెంత?"

"ఇరవై రెండు"

"ఈ ఇరవై రెండేళ్ల కాలంలో ఎన్నో పనులు చేసి ఉంటారు మీరు"

"అవును, మరి"

"ఇన్ని సంవత్సరాల్లో మీరు చేసిన అతి ముఖ్యమైన పని ఒకటి చెప్పగలరా?"

విశ్వం ఆలోచించాడు.

"ఏదైనా సరే, మీరు గుండెమీద చెయ్యి వేసుకుని ఫలానా ఘనకార్యం చేశానని చెప్పగల ఒక్క పని, కనీసం ఒక్కమంచి పని చెప్పండిచాలు"

విశ్వం నుదుటిమీద స్వేదబిందువులు చేరాయి. ఒక్కమంచి పని తను ఒక్క మంచి పని కూడా ఇంతవరకూ చెయ్యలేదా? గొప్ప పనికాక పోవొచ్చు- కాని కనీసం ఒక్క మంచి పని.

విశ్వం తలవంచుకున్నాడు నిరుత్తరంగా

"పోనీ కనీసం అలాంటి పనిఏదైనా చెయ్యాలను కున్నారా?"

"ఎందుకనుకోలేదు" అన్నాడు విశ్వం తెప్పరిల్లి

"ఏమిటది?"

విశ్వానికి పచ్చివెలక్కాయ నోట్లో పడ్డట్టయింది. ఎంత ఆలోచించినా ఏమీ తట్టటం లేదు.

"ఒక్క ప్రశ్న అడుగుతాను. తడుముకోకుండా సమాధానం చెబుతారా?"

"అడగండి."

"మీ జీవిత లక్ష్యం ఏమిటి?"

ఏమిటి తన జీవిత లక్ష్యం? శూన్యంగా చూశాడు విశ్వం.

"మీకు ప్రత్యేకించి ఏమీ లక్ష్యం లేదన్న మాట?"

తను పూర్తిగా పరాభవం పొందాడు కాని పరాభవం కంటె కూడా తన నిష్ప్రయోజకత్వం అతన్ని బాధపెట్టింది ఇటువంటి ప్రశ్నే తనలో ఎప్పుడూ ఉదయించలేదు.

ఎంత భావదారిద్ర్యం!

ఉపన్యాసకుడు విశ్వం భుజం తట్టి అన్నాడు "జరిగిన కాలంలో మీరేమీ చెప్పతగిన పని చేసి ఉండక పోవొచ్చు పరవాలేదు రాబోయే రోజుల్లో మీరు తోటివాళ్లు విస్మయపడే మహాకార్యాలు చెయ్య నక్కర్లేదు కావలసిందల్లా చెయ్యాలనే ఉత్సాహం, కోరిక ఉండటం. జీవితంలో ఒక లక్ష్యాన్ని ఏర్పరచు కోవటం సఫల్యం చేసుకోటానికి నిజాయితీతో ప్రయత్నించటం. అంతే"

"కృతజ్ఞుణ్ణి" అన్నాడు విశ్వం

"మీకేమైనా మాట్లాడాలనిపిస్తే విషయాలుంటే తరవాత మిమ్మల్ని కలుసుకుంటాను ఇదిగో నా అడ్రసు" ఒక చిన్న కార్డు విశ్వానికిచ్చాడు ఉపన్యాసకుడు విశ్వం అది స్వీకరించి సెలవు తీసుకుని బరువుగా అడుగు వేసుకుంటూ మైదానందాటి బజార్లో ప్రవేశించాడు ఇప్పుడతని మనసులో విచారం లేదు తను త్వరలోనే మేల్కొన్నాడు అసలు తన జీవితం ప్రారంభమయ్యే తరుణంకూడా అదే తన అస్తిత్వాన్ని తను సార్థకం చేసుకోగలడు.

బజార్లో నడుస్తున్నాడు విశ్వం బజారంతా అతనికి కొత్త కొత్తగా కనిపించసాగింది ఆలోకాన ప్రతి వ్యక్తి శ్రమపడుతున్నాడు ధనసంపాదనకి. శ్రమకి తగిన ప్రతిఫలం మాత్రం అందరికీ ముట్టదు చిన్న చిన్న దుకాణదారులు రోజంతా శ్రమపడి వస్తువుల అమ్మకంకోసం నానాయాతనలూ పడుతూండటం తను చాలాసార్లు గమనించాడు. కత్తిలేని కోతివాళ్ళు అతని కళ్ళలో ఎప్పుడూ మెదుల్తూనే ఉంటారు. ఏమిటి దీనికి విరుగుడు? ఆలోచిస్తున్నకొద్దీ అతడు నిరుత్సాహ

"నేను డ్రాయింగ్ మాస్టర్ని కాదుగా"

"ప్రాక్టీసు చేసినా రాదంటారా?"

"ఉహూఁ మీకు ఫ్రీ హాండ్ లేదు."

విశ్వం ముఖంలో నిరాశ కనిపించింది. 'ఇక మీ ఇలా నిరుత్సాహపరుస్తాడేం ఈ మనిషి' అనుకున్నాడు

"ఏదైనా బొమ్మ వేస్తాను, చూస్తారా?"

చిత్రకారుడు అయిష్టంగా ముఖం పెట్టాడు అది అంగీకారమే ననుకుని విశ్వం కోయిలబొమ్మ గీశాడు

"ఎలా ఉందండీ?" అని ఆశగా ఆయనవైపు చూశాడు, తప్పక మెచ్చుకుంటాడని భావిస్తూ.

అతను చిన్నగా, పొడిగా నవ్వాడు

"చిత్రలేఖనం బదులు మరేదైనా చేస్తే మీ కాలం వృధాకాదు" అన్నాడు.

"అంటేనా?"

"మీమీద నాకేమీ ద్వేషం లేదు ఫ్రీహాండ్ లేదని చెప్పాను, అంతే"

"మనిషి పుట్టగానే అక్షరాలు రాయటం రాదు కదండీ"

"అవును. ఇప్పుడా సంగతెందుకు?"

"నేర్చుకుంటే ఏదైనా వస్తుందని చెబుతున్నాను కాకులు రాసినవాడు కుదురైన అక్షరాలు రాస్తున్నాడు మీరైనా ఉన్నట్టుండి అమాంతంగా ఈ విద్య మీకు వొచ్చిందని తెలుసుకున్నారనుకోను"

"నన్ను మీ శిష్యుడిగా చేసుకుంటున్నారా"

"అయితే వినండి. కాని నా మాటలు నిజమని మీకు రుజువు చెప్పగలను సెలవు"

ఆయన ప్రత్యుత్తరానికి ఎదురు చూడకుండా విశ్వం చరచర వెళ్ళిపోయాడు ఆ నాటినించీ అహోరాత్రులు శ్రమపడి, పుస్తకాలు చదివి తెలుసుకుని, అభ్యాసంచేసి రేఖాచిత్రాలు సునాయాసంగా గియ్యటం నేర్చుకున్నాడు. వ్యక్తిమీద అతనికి నమ్మకం ఏర్పడింది.

ఓ రోజు సాయంత్రం మళ్ళీ ఆ చిత్రకారుడి దగ్గరికి వెళ్లాడు

"మళ్ళీ వచ్చారే?" అన్నాడాయన విశ్వాన్ని గుర్తుపట్టి

"శిష్యరికంకోసం కాదులెండి, జవాబుకోసం" అంటూ కాగితం ఆయనముందుపెట్టి ఓ మూల నిల్చున్నాడు.

"ఇదిగో మీ కుర్చీ ఇంకా కొన్ని కావాలా? ఒకటి, రెండు, మూడు—" చిన్నవి, పెద్దవి వరసగా కొన్ని కుర్చీలు గీశాడు విశ్వం ఆయన ఆశ్చర్యంగా వాటివైపు చూశాడు

"అలా తెల్లబోకండి మరి నాకు ఫ్రీ హాండ్ లేదుగా" వ్యంగ్యంగా అంటూ వెళ్ళిపోబోయాడు విశ్వం. తటాలున చిత్రకారుడు అతని భుజంమీద చెయ్యివేసి ఆపాడు చిరునవ్వు నవ్వాడు.

"శభాష్" అన్నాడు

విశ్వంకోపం ఇంకా పోలేదు

"సెలవిప్పించండి" అంటూ వెళ్ళబోయాడు

"నిన్ను ఆశీర్వదిస్తున్నాను" అన్నాడాయన విశ్వం వెళ్ళలేకపోయాడు. ఓటమిని అంగీకరించి తనని ఆశీర్వదించిన అతని సహృదయత్వం విశ్వంకాళ్ళకి బంధాలు వేసింది

"తొందరపడి ఆవేశంగా మాట్లాడాను క్షమించండి"

"ఫరవాలేదు. నా దగ్గర తెలుసుకోవాలసింది ఏదైనా ఉంటే నీ ఇష్టం వచ్చినప్పుడు నిరభ్యంతరంగా రావొచ్చు చాలా సంతోషిస్తాను" అన్నాడు చిత్రకారుడు అతని హృదయ వైశాల్యం విశ్వంలో పశ్చాత్తాపం కలిగించింది

"మహాభాగ్యం" అన్నాడు.

"వెళ్ళిరా ఇంక" సెలవిచ్చాడు చిత్రకారుడు.

తేలికపడ్డహృదయంతో విశ్వం సెలవుతీసుకున్నాడు కోపంవస్తే ఎంత మూర్ఖత్వం ఉంటుంది! అదే ఆ చిత్రకారుడి సందేశం అనిపించింది విశ్వానికి

## 7

నవ్యనాట్యసంఘం అనే సంస్థ ఆ రోజున ప్రారంభోత్సవం జరుగుతోంది. దానికి కార్యదర్శి రంగా రావనే యువకుడు. బ్యాంక్ టెలర్. అతను

"రంగారావు గారూ, విశ్వంగారిచేత మంచి నాటకం ఒకటి రాయించాలి మీరు" అన్నాడు ఒక సభ్యుడు.

"అందులో మంచి గేయాలు తప్పకుండా ఉండాలి"

మరో సభ్యుడు తన అభిప్రాయం వెలిబుచ్చాడు.

"థాంక్స్ — కాని నాకు నాటకాలు రాయటం రాదండీ" అన్నాడు విశ్వం

"మేం నమ్మంలెండి."

"సభ్యుడెవరి మనస్సు తప్పించుకోవాలంటే ఎలా?" అన్నాడు రంగారావు.

"శక్తికి దాటిన పనులు నెత్తికేసుకుంటే ఏమవుతుందో తెలుసా?"

"అదంతా మాకు వొదిలెయ్యి"

"నాటక సంఘం నాలుగు కాలాలపాటు వర్ధిల్లాలని లేదా?"

"మంచిపాటలు చెప్పటం నువ్వు తలచుకుంటే రాయగలవు అంతే." అన్నాడు రంగారావు. అందరూ అమాటే సమర్థించారు. విశ్వానికి మాత్రం గుండెల్లో రాయిపడ్డది. తనెప్పుడూ నాటకం కాదు గదా కథ కూడా రాయలేదు. ఏవో చిత్రకాని వాళ్ళ మీదా, ప్రజల మీదా పద్దెలే ఫలితాలు. సంగతి అలా ఉంచి తనకి అపచారం చేసుకున్నవాడవుతాడు. ఏం చేయాలో అతనికేం తోచలేదు. రంగారావుతో ఈ విషయం గురించి తరవాత రెండు మూడుసార్లు ముచ్చటించాడు. అతను ఉన్న సంగతి విశదం చేశాడు.

"ఒరే విశ్వం, నువ్వి నాటకాలు చదివిన ఎక్కువలేవు ఉన్నాని కూడా చాలని 'ఉద్యోగ విజయాలు' లాంటివి మనం ప్రదర్శించటం లేదు గదా! నాటక సంఘం శ్రేయస్సు కోరి నువ్వు నీచేతనైనంతలో ఏదైనా రాసివ్వు, బాగుంటే వేద్దాం."

ఇక విశ్వం ఏమీ అనలేకపోయాడు. ఆలోచించి సాంఘిక నాటిక ఒకటి రాసిచ్చాడు. అందరూ 'ఫస్టు'గా ఉందన్నారు. రిహార్సల్స్‌కి వొచ్చిపోతూ లిస్తూ ఉండమని విశ్వాన్ని అడిగాడు. విశ్వం అలాగే అన్నాడు కాని వెళ్ళటానికి అతనికి మనసొప్పేదికాదు. ఆ నాటకాల గొడవల్లో పడితే తన చిత్రకళాపోషణ పూర్తిగా దెబ్బతింటుంది. చిత్రకళే తన లక్ష్యం.

ఒకరోజు రంగారావు మరీబలవంతం చెయ్యటం వల్ల ఆ సాయంత్రం రిహార్సలుకి వెళ్ళాడు.

డాబ్లో ఓ హాలంత అద్దెకి తీసుకుని 'నాటక సంఘం' అని బోర్డు కట్టారు. ఆ గదిలోని వాతావరణం చూసేసరికి విశ్వానికి చిరాకువేసింది. ఉన్న సామాను చిందరవందరగా వుంది. కొంతమంది పేకాట, మరికొందరు సిగరెట్లు తాగుతూ గది పొగతో నింపి కాల్చి వేసిన పీకలు గదిలోనే పారేస్తున్నారు. సభ్యులలో కూడా ఒక క్రమశిక్షణ లేదు. ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు ప్రవర్తిస్తున్నారు. తలా ఒకపక్కన కూర్చుని ఉండి సభ్యులు మాట్లాడుతూనే ఉన్నారు.

"హీరోయిన్ ఎవరు వేస్తున్నారు?" అన్నాడు విశ్వం.

"వసంత అనే అమ్మాయి. అందాల బరిణె. చూస్తే సుమ్మయిపోతావు. 'ఒక్క నవ్వే పలు వజ్ర వైఢూర్యాలు' అన్న కవి మాటని చూశే రాకాదా అనిపిస్తుంది. ఆ కళ్ళూ, ఉంగరాల జుట్టూ, నాలు జడా కపోలాలూ ఓహ్!"

అతని ధోరణి మధ్యలోనే ఆపి, "నువ్వు కూడా కవివా ఏమిట్రోయ్?" అన్నాడు విశ్వం.

"ఆ పిల్లని ఒక్కసారి చూస్తే కవిత్వం నురుగులు కక్కుతూ పరుగులు తియ్యదూ?"

"అదేం అలంకారం, మహాశయా?" అన్నాడు ఒక నటుడు.

అందరూ గొల్లుమన్నారు.

"నీకు పెళ్ళయింది కనుక?" అన్నాడు విశ్వం.

"అయితే ఏమండీ, రసపాయి మన రంగారావు" అన్నాడు ఒక సభ్యుడు. అందరూ మళ్ళీ గొల్లుమన్నారు.

"జాగ్రత రంగారావు. చెయ్యి పట్టుకు చేస్తే. కోరాణి వ్రాదని"

"[illegible]?" అన్నాడు రంగారావు.

విశ్వం ఈ సంభాషణకి విసుక్కున్నాడు. విషయం తప్పిస్తూ అన్నాడు

విభాగము కాని, ఒక గ్రంథకర్త నాటములో తీర్చబడినది తోచగు కాక, అందలి భాగములు కొన్ని అర్థము స్థితిలోనే లేవు జన్మకాలము, ఆధాన కాలము, అనురెండింటికి కాక, చిత్రమైన కాలమునకు పరాశర జాతకము గురించి సమన్వయము చేయుట సంప్రదాయమనియు, అది కష్టసాధ్యమనియు, ఒకానొక ప్రాచీనగ్రంథ వ్యాఖ్యాత సూచించెను. ఇది ఏదో, వ్యాసఘట్టము!

ఇట్టి సందిగ్ధములలో ప్రాచీన మహర్షులు చెప్పినదంతయు తమకు తెలిసియున్నదనుకొను సర్వజ్ఞంమన్యులుండిరేని, ఎవరు వారికి సమాధానము చెప్పగలరు.

అది యట్లుండె.

అన్ని శాస్త్రములవలె యీ జ్యోతిశ్శాస్త్రము సహ పరిశోధకులకు శాస్త్రజ్ఞుల అనుభవ విశేషముల వలన క్రమాభివృద్ధికి రాతగినదే యనుట యీ విమర్శకుల బుద్ధికి స్ఫురించదు. అప్పుడప్పుడు నూతనోపాయములతో సంస్కరించినప్పుడే శాస్త్రము వన్నెకెక్కునని చెప్పిన దైవజ్ఞుడైన వరాహమిహిరుని అర్థవద్దృష్టిని, భావౌదార్యమును స్మరించినచో, ఇట్టి విమర్శకుల సంకుచితవృత్తికి అది అంజనము కాగలదు. మన ప్రాచీన సంప్రదాయములలో లేని అనేకాంశములను ఆ మహాశయుడు యవనమతమునుండి స్వీకరించి ఎందు లేక బాహాటముగా తన గ్రంథములో చేర్చినాడు. అతడు వర్ణించిన ద్రేక్కాణ స్వరూపములు యవనులు చెప్పినవే. కొన్ని గజనోరాగాదులలో యవనుల మతము నెత్తి అతడు దూషించినాడు. అంతియేల! గ్రహముల అన్యోన్య మిత్రత్వ శత్రుత్వములను గూర్చి ప్రాచీనమతమును చెప్పియే గాక, దానికంటె చాల భిన్నమైన యవనమతమును సత్యమని తన బృహజ్జాతకములో అతడు నిరూపించినాడు. ఈ విషయములో యవన సంప్రదాయమే వరాహమిహిరునికి అభిమతమని పగుణాకరుడు [illegible] కూడను హోరా తంత్రకర్తయైన 'వివాహ బృందావన' గ్రంథములో—

"ఇద మదిరత వరాహ వివోచనో
విజయ తేనపు దూషితవాన్ పునః,
న బహు మన్యతి ఏవ యథార్థతం,
జయతి శాస్త్ర మిదం యవన సేవ్యకి"

అని నిర్భయముగా సిద్ధాంతీకరించినాడు. కావునే,

మ్లేచ్ఛాహి యవనా, స్తేషు
సమ్యక్ శాస్త్ర మిదం స్థితం,
ఋషి వత్తేపి పూజ్యంతే
కిం పునర్దైవ విద్ద్విజః"

అని వరాహమిహిరాచార్యులే యవనుల నెంతో గౌరవించినాడు. అతని యనంతరము సమరసింహాగ్గులను ప్రాచీనులు సాధించిన తాజక సంప్రదాయము పాశ్చాత్యుల పారసీక భాషనభ్యసించి అందలి వాఙ్మయమునుండి సంపాదించినదే కాని, మూడువందల సంవత్సరముల క్రిందనే, 'హోరారత్నా'కర బలభద్రుడు చాటి చెప్పినాడు. నాడుకనో నుండిన దశాపద్ధతులు చిరకాల సాన్నిహితులై త్రిస్థికరము ఫలములను చూపని కారణమున, యవన శాస్త్రమునుండి తన్త్రజాతకపద్ధతి మున్నగు ప్రయోగములను సమరసింహాదులు గ్రహించి విపులీకరించిరట.

"ప్రాయో న జాతక ఫలే
చిరప్రయోగ్యే మతిశ్చరతి పుంసాం,
తేనాత్ర హాయన ఫలం
ప్రకాశ్యతే తాజక ప్రోక్తం"

అని సమరసింహుడే చెప్పినాడట

లగ్నము, సప్తగ్రహములు అను ఎనిమిదింటికి గోచారములవలన, కలుగు శుభాశుభ ఫలములను సూచించు పద్ధతిని అష్టకవర్గ మందురు కదా? ఈ పద్ధతిలో రాహుకేతువులకు స్థానము లేదు. కాని వరాహమిహిరాదులు చెప్పకపోయినా, రాహుకేతువులకు భావఫలములను తెలుపుటకు వారు విపులముగ వ్రాసిరి. అట్లే వారి స్థానములకు పయితము గోచారఫలము, లేలయుండరాదు? వానికి ఫలములను సాధించి 'ఏకవర్గ' మను పేరుతో సుమారు మూడు సంవత్సరముల వెనుకనుండిన ఒకానొక శాస్త్రజ్ఞుడు ప్రశ్నగ్రంథము రచించెననియు అది అముద్రితముగా మూలపడియున్నదనియు, కొన్ని సంవత్సరముల క్రింద ఒకానొక ప్రాచీనజ్యోతిశ్శాస్త్ర పండితుడు నాతో చెప్పెను.

పరిశోధకుల అనుభవముల మూలముగ, క్రమముగా శాస్త్రసంప్రదాయములు అభివృద్ధి నొందుచున్నవనుటకు ఇంకెన్నియో కారణములు చూపవచ్చును. ఇటులుండగా, త్రిస్థికరముగ నూతన సాముగ్రి పరిశోధకుల పుణ్యమున మనకు లభించినప్పుడు దానిని నిరాకరించుట ఏమి న్యాయము?

పోనిండు ప్రాచీన పద్ధతిలో ఏమార్పులు చేసినా, మహర్షులపట్ల అపచారమో అపరాధమో, చేసినట్లు మన ప్రాచీన శాస్త్రజ్ఞులు భావించెడివారా? త్రైరాశిక ప్రాచీనకాలమున జ్యోతిశ్శాస్త్రమున ఇరువది ఎనిమిది నక్షత్రములు. తరువాత ఎప్పుడో ఏమి కారణమో ఇరువదియేడు నక్షత్రముల పద్ధతి వచ్చినది.

"నక్షత్రాణాం అభిజిత్" అని భగవద్వాక్యరూపముగా భగవద్గీతలో ప్రశస్తి చెందిన 'అభిజిత్'

# కౌటిల్యుని అర్థశాస్త్రము

శ్రీ పి. వరహాలరావు

ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్రచరిత్రలో కౌటిల్యుని అర్థశాస్త్రం అత్యంత ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తుంది. కౌటిలీయం, మనరాజనీతి శాస్త్రంపాలిట మహోన్నత భాండాగారం. దీన్ని రచించినవాడు కౌటిల్యుడని లేక చాణక్యుడు. ఇతడు తక్షశిలానగరంలో జన్మించాడని కొందరు, ద్రవిడ దేశీయుడని మరికొందరు ఊహిస్తున్నారు. ఇతడు ఆంధ్రుడనే ప్రవాదంకూడా ఉంది. ఏది ఏమైనా, ఈయన జన్మస్థానం యిది అని చరిత్రపండితులు యిదమిత్థంగా తేల్చలేదు. ఈయన వేదవేత్తయే గాక నాటికాలపు విద్యలన్నిటినీ, సమగ్రంగా అభ్యసించినవాడు. తక్షశిలావిశ్వవిద్యాలయంలో విద్యార్థిగావున్న దినాల్లోనే కూటముద్రలు (దొంగనాణెములు) తయారుచేసేవాడని, 'కుంటలక్ష్మ'అంటే 7000 కోటలుగలవాడని ప్రతీతి. "ముద్రారాక్షస" నాటకకర్తయిన విశాఖదత్తుడు "కౌటిల్యః కుటిలమతిః" అని ఒక పాత్రచే యీయన శీలాన్ని అభివర్ణింపజేశాడు.

కౌటిల్యుడు "అర్థశాస్త్రాన్ని" క్రీ. పూ. 300 ప్రాంతాల రచించి వుంటాడు. కొంతకాలానికి వచ్చిన నాటినుంచీ యీ మహాగ్రంథం కీర్తిచంద్రికలు, సూర్యకిరణాల్లాగ దశదిశలా వ్యాపించాయి. క్రీ. శ. 8 వ శతాబ్దంలో జీవించిన కామందకుడు తన "నీతిసారం"లో కౌటిలీయ ప్రాశస్త్యాన్ని వేనోళ్ళ ప్రశంసించాడు. శాస్త్రాంబుధిలోనుండి కౌటిలీయమనే రాజనీతి శాస్త్రామృతాన్ని ఉద్ధరింపజేసిన మహోన్నత ప్రతిభాశాలిగా కౌటిల్యుణ్ణి వర్ణించాడు. క్రీ. శ. 8 వ శతాబ్దంలో జీవించిన భవభూతి తన 'మహావీరచరిత్ర'లోను, భవభూతికి 50 సంవత్సరాలకు పూర్వమున్న మహాకవి దండి తన 'దశకుమార చరిత్ర'లోను, క్రీ. శ. 5 వ శతాబ్దంలో వ్రాయబడిన 'నారదస్మృతి'లోను, కౌటిలీయార్థశాస్త్రం ప్రస్తావించబడడం గమనార్హం. న్యాయభాష్యము క్రీ. శ. 850 లో వ్రాయబడిన 'యాజ్ఞవల్క్యస్మృతి'లాంటి ధర్మశాస్త్రగ్రంథాలు, మేధాతిథి, మల్లినాథుడూ వంటి సుప్రసిద్ధ వ్యాఖ్యాతకారులూ, కౌటిలీయాన్ని పేర్కొన్నారు. ఇంతమంది మహామేధావుల, ఉద్దండ పండిత ప్రకాండుల దృష్టి ఆకర్షించిన యీ గ్రంథం కొంతకాలం అదృశ్యమైపోయింది.

మౌర్యచంద్రగుప్తుని ఆస్థానంలోవున్న గ్రీకు రాయబారి మెగస్తనీసు, తన 'ఇండికా' గ్రంథంలో చంద్రగుప్తుని గూర్చి వివరమైన సమాచారాన్ని అందించి, మౌర్యసామ్రాజ్యాన్ని స్థాపించి, చంద్రగుప్తుని ప్రధానామాత్యుడుగావుండి, దైనందిన రాజ్యకార్య నిర్వహణలో పాల్గొనిన కౌటిల్యుని పేరైనా పేర్కొనకపోవటం నిజంగా ఆశ్చర్యకరమైన విషయమే! దీన్ని ఆధారంగా చేసికొని, కొందరు పాశ్చాత్య, భారతీయ పండితులు కౌటిల్యుడు పుట్టుకే పురాణానికి చెందిన వ్యక్తి అనే నిర్ణయానికి వచ్చారు. ఐతే వారి సందేహాలు, నిర్ణయాలు, నిరాధారాలని చరిత్ర రుజువుచేసింది.

కొన్ని శతాబ్దాలదాకా ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్రం పాలిట కామధేనువులా ఉన్న 'అర్థశాస్త్రం' కొంతకాలం మరుగునపడిపోయి, 20 వ శతాబ్ది ప్రారంభంలో, 1900 ప్రాంతాన డాక్టరు శ్యామశాస్త్రిచే కనుగొనబడింది. ఆయన యీ గ్రంథంలోని కొన్నిభాగాలు ఇంగ్లీషు భాషలోనికి అనువదించి ప్రచురించారు. దాంతో యూరపియన్ పండితులు, ప్రత్యేకంగా జర్మన్ సంస్కృత విద్వాంసులు, దీన్ని అధ్యయనం చేసి పరిశోధనలు ప్రారంభించారు. అంతదాకా, ప్రాచీన హైందవులకు స్వతంత్ర అర్థశాస్త్రమంటూ, ఒకటీ లేదని ప్రచారం చేసిన యూరపియన్ పండితుల దృక్పథంలో కౌటిలీయ పునర్దర్శనం విప్లవాత్మకమైన మార్పును తీసుకువచ్చింది. అంతేగాదు, కౌటిలీయానికి పూర్వము, తదనంతరము ఎన్నో రాజనీతిగ్రంథాలు వ్రాయబడ్డాయి. అవన్నీ కౌటిలీయంలా, ఏదో ఒకనాడు వెలుగులోకి రాకుండా పోవని ఆశిద్దాము.

కౌటిల్యుడు 'అర్థశాస్త్రాన్ని' రచించేందుకు సూత్రశైలి ఉపయోగించాడు. అందుచేత, ఆయన అభిప్రాయాలు అతినిగూఢంగా కన్పిస్తాయి. గ్రంథంలో ఉపయోగించిన పరిభాష, తక్కిన సంస్కృతగ్రంథాల్లోగానీ, నిఘంటువుల్లోగానీ కన్పించదు. కౌటిల్యుని పిదపవచ్చిన గ్రంథకర్తలు ఎవ్వరూ ఆయనలా రాజ్యపాలనకు సంబంధించిన విషయా

దమైన 'కేరం' అందుకొని నాటి క్రిస్టియన్ నీతి శాస్త్రవేత్తలు, మతాధిపతులు, ఆయనమీద ఒక్కుమ్మడిని విరుచుకుపడ్డారు. ఈ విషయాన్నిగూర్చి ప్రొఫెసర్ మార్స్ యిలాగంటాడు—

"Niccolo Machiavelli is perhaps the most universally reprobated figure in the history of political philosophy, the man whose precepts are universally disavowed in principle, but regularly followed in practice. Yet Machiavelli was a moral man according to the conventions of his time and apparantly also a man of considerable culture and charm"

కౌటిల్యుని కాలంనాటి భారతదేశంలో ప్రధానంగా ఉత్తరభారతంలో చిన్న చిన్న రాజ్యాలు అసంఖ్యాకంగా వుండేవి. రాజకీయైక్యం కరిమింగిన వెలగపండులా అదృశ్యమైపోయింది. నిరంతరం అంతఃకలహాలలో యీ రాజ్యాలు కుత్తుకలదాకా మునిగిపోయాయి. రాజకీయమైన ఐక్యం నశించి శాంతిభద్రతలు క్షీణించిన విషమ్యాం పరిస్థితులలో కౌటిల్యుడు జన్మించాడు. అలాంటి పరిస్థితుల్లో భారతదేశాన్నంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యంక్రిందకు తీసుకువచ్చి తద్వారా ఐక్యభారతి నిర్మాణమే కౌటిల్యుని ఏకైకలక్ష్యం. ఈ మహత్తర లక్ష్యసిద్ధికే, ఆయన అర్థశాస్త్రరచన కుపక్రమించాడు.

ఇదే విధమైన అనైక్యం, అంతఃకలహాలు, శాంతిభద్రతలలేమి మేకావెల్లీ జీవించిన ఇటలీలో వుండేవి. అలాంటి విచ్ఛిన్నకర పరిస్థితులనుండి మాతృదేశాన్ని రక్షించి ఏకీభూతమయిన ఇటలీ సంస్థాపన కోసం మేకవెలీ తన సుప్రసిద్ధగ్రంథం రచన చేశాడు.

మానవస్వభావంలో అధికార దాహం అంతర్గర్భితంగా వుండంటాడు కౌటిల్యుడు. ఆ అధికార దాహంలోని కౌటిల్యాన్ని, కండ-నీ అనూఖని కుట్రలని ఉన్నది వున్నట్లుగా అతడు పరిశీలించి వివరించాడు. ఇదేపని మేకవెలికూడా చేశాడు. కౌటిల్యునికి పూర్వమున్న ధర్మశాస్త్రవేత్తల దృక్పథం ఇంగుడు భిన్నమైంది. అది ఆదర్శాల పుట్ట, అదరాక ఎంతో దూరం ధర్మశాస్త్రవేత్త రాజ్యాదర్శాలను, వాటిని సాధించేందుకు వినియోగించదలచిన మార్గాలను వివరించాడు. కౌటిల్యుడు దీనితో ఛేదించాడు. ఆదర్శప్రాయమగు రాజ్యాన్ని (Republic) "స్వర్గలోకంలో" సృష్టించిన ప్లేటోతో ఆయన శిష్యుడు అరిస్టాటిల్ ఎలా అంగీకరించలేదో, అలాగే పూర్వ ధర్మశాస్త్రవేత్తల ఊహాప్రాయమైన ఆదర్శయుతమైన, కేవల ధర్మబద్ధమైన సూత్రాలనుండి కౌటిల్యుడు ఛేదించి, ఆచరణ యోగ్యము కానటువంటి సమాజ పరిస్థితుల కనుగుణమైన మార్గాన పయనించినాడు. అర్థశాస్త్రగ్రంథాన్ని మరో మార్గం పట్టించి, ధర్మశాస్త్రాలకు భిన్నమైన స్వతంత్రశాస్త్రంగా నిర్మించాడు. ఇదే అతను చేసిన ఎనలేని కార్యం. అందుకే కౌటిల్యుడు ప్రాచీన హైందవ అర్థశాస్త్ర చరిత్రలో అజరామరుడయ్యాడు. నాటి పండితలోకంలో అర్థశాస్త్రగ్రంథాన్ని ధర్మశాస్త్రాల క్రిందికి త్రోసి మరణ శయ్యంగావున్న శాస్త్రానికి తిరిగి జీవంపోశాడు. అందుకే కామందకుడు తన "నీతిసారం"లో, కౌటిల్యుణ్ణి అవతార పురుషునిగా ప్రశంసించాడు.

## కౌటిలీయం - అర్థశాస్త్ర నిర్వచనం

కౌటిల్యుడు అర్థశాస్త్రాన్ని యిలా నిర్వచించాడు "అర్థం" అంటే ప్రజలతో కూడిన ఒక ప్రత్యేక భూభాగం (జనపదం) ప్రజలతో కూడిన ఒక ప్రత్యేక భూభాగాన్ని సంపాదించి, దాన్ని మరింతపరిపాలించి అభివృద్ధిచేయుటకు అనువైన వివిధ మార్గాలను పరిశీలించు శాస్త్రమే—అర్థశాస్త్రం (That Science which deals with the means of acquisition and growth of territory).

"మనుష్యాణాం వృత్తిరర్థః
మనుష్యవతీ భూమిరిత్యర్థః
తస్యాః పృథివ్యా లాభపాలనోపాయః శాస్త్రం
అర్థశాస్త్రం ఇతి" (అర్థశాస్త్రం—పేజీ 426)

మానవులకు బ్రతికేందుకు మూలాధారం అర్థం. అర్థం అంటే ప్రజలతో కూడిన భూభాగం. కాబట్టి ఆభూభాగాన్ని ఎలా సంపాదించాలో, ఎలా భద్రపరచాలో, వివరించు శాస్త్రమే—అర్థశాస్త్రం.

రాజదండాన్ని నిరంతరం సమర్థతతో ఉపయోగించడమే "దండనీతి" అని నిర్వచించాడు కౌటిల్యుడు. ఈ నీతిలో నాలుగు ప్రధాన విషయాలు గర్భితమై వున్నాయి.

1 ఏదైతే లభ్యంకాలేదో దాన్ని సంపాదించడం, (అలబ్ధ లాభార్థ)

2 ఏదైతే లబ్ధమైనదో దాన్ని భద్రపరచడం, (లబ్ధ పరిరక్షణం)

3. అలా భద్రపరచబడిన దానిని వృద్ధిచేయడం, (రక్షిత వివర్ధనం)

4 అలా వృద్ధిచేయబడిన దాన్ని తగినవారికి—అర్హులకు—పంచిపెట్టడం (వృద్ధస్య తీర్థేషు ప్రతిపాదనం)

కౌటిల్యుడే కాదు యిలాంటి నిర్వచనం చేసింది, మనువుకూడా తన ధర్మశాస్త్రంలో పై విధంగానే చెప్పాడు భూభాగాన్ని (దండం) సైన్యం సహాయంతో సంపాదించాలని చెప్పాడు భూభాగం (సంపాదన) తో సంబంధించినదే దండనీతి లేక అర్థశాస్త్రం అని మనువు నిర్వచనం

## రాజ్య దృక్పథం : దాని లక్షణాలు

ప్రాచీన హైందవ అర్థశాస్త్రజ్ఞులు రాజ్యానికి ఏడు లక్షణాలు, లేక ప్రకృతులు వుంటాయని చెప్పారు పాశ్చాత్య రాజనీతి శాస్త్రజ్ఞులు, రాజ్యానికి నాలుగు లక్షణాలుంటాయని చెప్పారు—1 జనులు 2 భూభాగం 3 ప్రభుత్వం 4 సార్వభౌమాధికారం ఈ నాలుగు లక్షణాన్ని బహిరంగ అంతరంగ సార్వభౌమాధికారాలని రెండుగా విభజించారు

మన శాస్త్రజ్ఞులు రాజ్యానికి ఏడు ప్రకృతులుంటాయని చెప్పారు ప్రకృతులంటే రాజ్యంయొక్క సహజభాగాలని, సహజమైన అంగాలని అర్థం చేసుకోవాలి. రాజ్యం అంటే రాజు పాలించే ప్రత్యేక భూభాగాన్ని సూచించదు రాజు పాలించే భూభాగమే "రాజ్యం" ఐతే, ఆ రాజ్యాన్ని (State) మన్ను ఏడు ప్రకృతుల్లో "రాజు" ఒక అంగంగా ఎందుకు పరిగణింపబడాలి? రాజు పాలించే భూభాగమే రాజ్యం ఐతే, ఆ భూభాగానికి "జనపదము" అనే పేరుపెట్టి దానిని ఒక స్వతంత్ర ప్రకృతిగా ఎందుకు మన రాజనీతిశాస్త్రవేత్తలు పరిగణించారు? కాబట్టి రాజు పాలించు భూభాగం రాజ్యం కాదు ఆ భూభాగానికి జనపదము అనే పేరు ప్రత్యేకంగావుంది రాజ్యం అంటే ప్రభుత్వంకూడా కాదు రాజ్యమునకు సంబంధించిన విధి కార్యకలాపాలను అదుపులో పెట్టు యంత్రము లేక కార్యనిర్వాహకవర్గమే ప్రభుత్వం కాకే దుర్గం (Fort) కోశం (Treasury) యీ రెండూకూడా రాజ్యంయొక్క ప్రకృతులవియే మన వారి దృక్పథం కాబట్టి ప్రభుత్వంగానీ, రాజు పాలించే ప్రత్యేక భూభాగంగానీ రాజ్యం కాదు స్వామి, అమాత్యులు, జనపదం, దుర్గం, కోశం, దండం, మిత్రం—యీ యేడు అంగాలు కలిస్తే రాజ్యం ఔతుంది అని మన శాస్త్రజ్ఞుల దృక్పథం

కౌటిల్యుడు తన "అర్థశాస్త్రం"లోనూ కామందకుడు "నీతిసారం" లోనూ, యీ యేడు ప్రకృతులనూ అతివిస్తరంగా వివరించారు. ప్రస్తుతం పై ఏడు ప్రకృతులనుగూర్చి కౌటిల్యుడు చెప్పినది పరిశీలిద్దాం

1 స్వామి స్వామి (రాజు) రాజ్యంయొక్క అత్యంత ప్రధానమైన లక్షణం లేక భాగమని కౌటిల్యుడంటాడు. స్వామి అంటే రాజు లేక సార్వభౌమాధికారి. ఈ సార్వభౌమాధికారం ఒక వ్యక్తియందుగానీ లేక పెక్కుమందిలోగానీ వుండవచ్చును ఈ స్వామికి ప్రధానంగా వుండవలసిన లక్షణాలు ఇవి

• ప్రజల్ని ఆకర్షించి వారిని తన శాసనాన్ని అనుసరించునట్లు చేసుకోగలగాలి (అభిగామిక స్వభావం)

1 ప్రజల్ని అర్థంచేసుకోగలగాలి (ప్రజ్ఞ)

2. శక్తివంతుడై వుండాలి (ఉత్సాహ)

3 ఆత్మసంపద కలిగినవాడై వుండాలి (ఆత్మసంపద)

4 శక్యసామంతుడై వుండాలి (తనచుట్టూవుండే వ్యక్తులను అదుపులో పెట్టగలిగినవాడై వుండాలి)

5. క్షుద్రులుగాని మంత్రి మండలిని కలిగివుండాలి

6 యుద్ధం చేయడానికీ సంధి చేసికోవడానికీ తగిన సందర్భాన్ని గుర్తించగలిగిన చాకచక్యం వుండాలి.

పైన చెప్పిన లక్షణాలను నిశితంగా పరిశీలిస్తే, స్వామి అంటే సామంతరాజు గాదనీ, అంతర్గత బహిర్గత సార్వభౌమాధికారాల్ని చలాయిస్తూ ఏ విదేశరాజ్యాధికారానికీ లొంగని సార్వభౌమాధికారి అని బోధపడుతుంది

2. అమాత్యులు — సాధారణంగా అమాత్యుడంటే రాజమంత్రి అని అర్థం కాని కౌటిల్యుని మొదటి అధ్యాయాలను జాగ్రత్తగా పరిశీలిస్తే, అమాత్య పదానికి అర్థం, రాజమంత్రి కాదనీ, ఏదైనా హోదాలోవున్న అధికారి ఐనా కావచ్చునని స్పష్టంగా బోధపడుతుంది అమాత్యుడు జనపదానికి చెందినవాడై వుండాలనీ, రాజ్యంపై అధికతర భక్తిశ్రద్ధలను కలిగివుండాలనీ చెప్పాడు.

3 జనపదం:—జనపదాన్ని జనం—పదము అని రెండుభాగాలుగా విభజించాలి. దీనికి సామాన్యార్థం, పల్లెపట్టు లేక గ్రామము కాని అర్థశాస్త్ర పరిభాషలో దీనికో ప్రత్యేకమైన అర్థంవుంది. పాశ్చాత్యరాజనీతి శాస్త్రంలో జనులు, భూభాగంలు లేదా స్టేట్ యొక్క

కాలంలో ప్రభుత్వోద్యోగులు తమతమ పనుల సక్రమంగా నిర్వహిస్తున్నారో లేదో పరిశీలించాలి తాను తెలిసికొన్న విషయాలు రాజుకు విన్నవించడం వంటివి వీరి కర్తవ్యాలు. రాజా మంత్రి పరిషత్తును అత్యవసర సమయాలలో కూడా సమావేశపరిచి వారితో సంప్రదించాలి వారిలో ఎక్కువమంది ఏది కార్యసిద్ధి దాయకమని సూచిస్తారో దాన్నే రాజు ఆదరించాలి మంత్రులలో ముఖ్యుడు ప్రధానామాత్యుడు. ఇతడు రాజుకు కుడిభుజం. రాజ్యపాలనలో రాజు తర్వాత రాజంతటివాడు. రాజ్యాన్ని అపహరించ గలంతటి అవకాశం అతనికుండేది. ప్రాచీన హిందూ రాజ్యానికి యుద్ధమూ, అంతరంగ విప్లవమూ, మహా అపాయకరమైనవి. యుద్ధంలో రాజు ఓడితే భంగం వాటిల్లుతుంది అందుచేత, యుద్ధం, అంతర్గత విప్లవంలాంటి విపరీత విపత్కర పరిస్థితులలో రాజు తానుచేసిన దోషాలే కయినా వుంటే ఒప్పుకొని ప్రధానమంత్రిని శాంతింప చేయాలి. కాకపోతే పదవిచ్యుతి భయం. నాటి రాజకీయ వ్యవస్థలో ప్రధానామాత్య పదవి ప్రాముఖ్యాన్ని శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్యగారు యిలా వివరించారు—

"అమాత్యపదవి యింతటి గౌరవముతో అధికారముతో నూ, కూడుకొనిన దగుటచేతనే, ప్రభువుండి యితనిని నేరుపరచినయెడల తనకు తప్పక జయము లభించునని శత్రువులు నమ్ముచుండువారు. రాజ్యమందలి గూఢచారు లందరిపై అమాత్యునికి నిరంకుశాధికారం ముండెడిది" అందుకే కౌటిల్యుడు పురోహితుడు, ప్రధానమంత్రి ఎంతటి మహాపరాధాన్ని చేసినా, వారికి మరణదండన విధించరాదని చెప్పాడు

## రాజకార్య నిర్వహణ

కౌటిల్యుని కాలంలో రాజకార్య నిర్వాహకులు మూడుభాగాలుగా విభజింప బడ్డారు. రాజు సమక్షమందుండి రాజ్యమంతటిపై కార్య నిర్వహణాధికారం వహించే కేంద్ర కార్య నిర్వాహకోద్యోగులు కొందరు. వారి పేర్లివి—1 మంత్రి, 2 పురోహితుడు, 3. సేనాపతి, 4 యువరాజు, 5 దౌవారికుడు, 6 అంతర్వంశికుడు, 7 ప్రశాస్త, 8 సమాహర్త, 9 సన్నిధాత, 10 ప్రదేష్ట, 11 నాయకుడు, 12. పౌరవ్యావహారికుడు, 13 కార్మాంతికుడు, 14. మంత్రి పరిషదధ్యక్షుడు, 15 దండపాలుడు, 16 దుర్గపాలుడు, 17 అంతపాలుడు, 18 ఆటవికుడు. ఈ 18 మంది ఉద్యోగులను 18 తీర్థాలనిపేరు ప్రధానకార్యాన్ని దేన్నైనా ప్రారంభించాలంటే ధనం లేకపోతే అడుగు ముందుకుపడదు. అందుచేత ధన సేకరణలో, కూడుకొన్న సమాహర్త ఉద్యోగం అధికతర ప్రాధాన్యతతో కూడుకొన్నది. రాజ్యానికి ఆదాయాన్నిచ్చే ప్రధాన అంగాలు—దుర్గ, రాష్ట్ర, ఖని, సేతు, వనం, వ్రజ, వణిక్పథాలు. వీటిని మంచిస్థితిలో వుంచి బాగా వృద్ధిచేయాలి విపత్తులేవి రాకుండా కాపాడాలి, వారించేందుకే కోశాన్ని ప్రముఖంగా నిర్వహించడమే సమాహర్త విధి. ఈ ఏడు రకాలైన ఆదాయాల్ని వసూలుచేయడానికి ఐదు లేక పది గ్రామాలపై గోపుని నియమించాలి. ఇతడు గ్రామంలోని సాగు భూముల్నీ, బంజరు భూముల్నీ, సర్వే చేయించి వాటికి సంబంధించిన దాన విక్రయాదుల్నీ, రిజిష్టర్ చేయడం, నాలుగువర్ణాలకు చెందిన ప్రజల జననమరణ లెక్కలను వ్రాయడం చేయాలి. గోపునిపై స్థానికుడనే మండలాధికారి, అతనిపై ప్రదేష్ట అనే రాష్ట్రాధికారి, నియమింపబడేవారు. వీరందరి సహాయంతో సమాహర్త అప్రమత్తుడై జనపదాన్ని పరిశీలిస్తూ నియమింపబడిన గూఢచారులను, జనపదమంతా తిరుగుతూ విషయాలను గ్రహించేవారు. యుద్ధం, దుర్భిక్షం యిత్యాది ఉపద్రవాలవల్ల కోశం ఖాళీఐతే, దేవుని పుణ్యాలు, మతకార్యకలాపాల వంటి సత్కార్యాల కోసం ధనం కావాలని మిషపెట్టి పౌరుల్ని యాచించాలి. మొదట కొంతమంది ధనవంతుల్ని ప్రోత్సహించి అధిక మొత్తాన్ని రాబట్టాలి. ఈ మొత్తాలు చూచి, పౌరజానపదులు తమ తమ మొత్తాల్ని ముట్టచెప్పేట్లు చేయాలి. యాచింపబడకుండా తమంతట తామే రాజుకు డబ్బు యిచ్చేవారికి, వారివారి మొత్తాలను దృష్టిలో పెట్టుకొని స్థాన, ఛత్ర, వేష్టన, విభూషణాలవంటి బిరుదులు యివ్వాలి. కోశం ఖాళీగావుంటే దేవ ద్రవ్యాన్నీ, శ్రోత్రియ ద్రవ్యాన్నీ కూడా సంగ్రహించవచ్చునని కౌటిల్యుడు ఖండితంగా చెప్పాడు. సంకట సమయాల్లో మతవిశ్వాసాలు, మూఢాచారాలు, ప్రచారంచేసి మోసంచేసి ఐనా, బెదిరించైనా, ప్రజలనుండి ధనాన్ని రాబట్టాలి, అని ఖండితంగా, నిర్భీతిగా చెప్పాడు కౌటిల్యుడు. తన శాస్త్రంలో ప్రతిపాదించిన సూత్రాలకు, కేవల ధర్మ సూత్రాలకు సమన్వయం కుదరదని వేరే చెప్పనక్కరలేదు. లక్ష్యం ఎంత పవిత్రమైనదో, దాన్ని సాధించేందుకు అవలంబించే మార్గాలు కూడా అంత పరిశుద్ధంగా వుండాలని - చాలా మంది చెప్పవచ్చు ఐతే దురదృష్టవశాత్తూ కౌటిలీయంలో ధర్మాధర్మాలకి, మంచిచెడ్డలకి తావులేదు. అతడు సూచించిన కూటయుద్ధాలు, భేదోపాయాలు, హింసాకృత్యాలు, మోసం, కుటిలత్వం, ధర్మశాస్త్రవేత్తలకి, నీతిశాస్త్ర పారంగతులకి నచ్చకపోవచ్చు. ఆదర్శానికి ఆచరణకి ఎంతోదూరంవుందని గుర్తించిన కౌటిల్యుడు సర్వకుటిల

# కౌటిల్యుని అర్థశాస్త్రము

తంత్రాలను ఎత్తుగడలను దైనందిన రాజ్యవ్యవహారాలలో కొలబంటి లోకుడా కా మునిగిన పరిపాలకుడు తప్పక అనుసరించ వలసిందేనని చెప్పాడు. ఇదే ఈ దృక్పథం రామాయణ కాలంనాటికే ఈ అభిప్రాయంలో వుంది దాన్ని విపులంగా వివరించినవాడు కౌటిల్యుడు ఆదికవి వాల్మీకి రామాయణంలో ఈ విధంగా చెప్పాడు—

> "నృశంస మనృశంసం వా ప్రజారక్షణ కారణాత్
> రాజ్య భార నియుక్తానా మేష ధర్మస్సనాతనః

రాజ్యభారం వహించే వారికి ప్రజారక్షణమే ప్రధానం క్రూరమైనా, క్రూరం కానిదైనా, ప్రజారక్షణకోసం రాజు చేసే ప్రతి పనీ, ధర్మకార్యమే—అని ఆదికవి వాల్మీకి చెప్పాడు

ఇంగ్లండును పాలించిన ట్యూడరు వంశపు రాజు ఏడవ హెన్రీ, తన మంత్రులైన ఎంప్‌సన్, డడ్లీ, మార్టన్‌ల సహాయంతో, ఆంగ్లప్రజలనుండి వివిధంగానే డబ్బు గుంజాడు ఒకవ్యక్తి ఆడంబరంగా బ్రతికితే, నీవు తప్పకుండా భాగ్యవంతుడవై వుండాలి కాబట్టి డబ్బు యివ్వమని బలవంతం చేసేవాడు ఎవరైనా పొదుపుగా బ్రతికితే ఎంతో ధనం నిలవచేసి వుండి వుండాలి కాబట్టి అది ఇవ్వు, అనేవాడు

మహాభారతంకూడా తేనెటీగ పూలద్వారా డబ్బు గుంజమని సలహా యిచ్చినా కౌటిల్యునివలె నగ్నంగా ప్రజలనుండి ధనాన్ని పిండమనిమాత్రం చెప్పలేదు

నిద్రపోయే మనిషిని దొంగ పట్టుకొని కొట్టుకు పోతే ఆ బాధ, అతడికి మర్నాడు మెలకువ వొచ్చిన తర్వాత గాని తెలియదు. రాజ్యాంగయంత్రం చేసే దొంగ దోపిడి అతిసున్నితంగా అంత తక్కువ బాధాకరంగా వుండాలని భారతం చెప్పింది కౌటిల్యుడు యిలాంటి చాటు మాటు దోపిడీ గాక, బహిరంగంగానే దోపిడీ చేయమన్నాడు కౌటిలీయంలో కేవలద్రవ్యానికే రక్షణ లేకపోతే, మనుష్యుల ప్రాణాలకిక ఎక్కడిరక్షణ?

రాజ్యంలో జనపదం, నగరం అనే రెండుభాగాలుంటాయి గ్రామాల సముదాయం జనపదం పట్టణాలతో కూడింది నగరం పరిపాలనా సౌకర్యంకోసం జనపదాన్ని నాలుగుభాగాలుగా విభజించాలి. కొన్ని గ్రామాలు పన్ను చెల్లించవలసినపనిలేనివి, కొన్ని పన్నులకు బదులు ప్రభుత్వానికి కావలసిన కూలిపని చేసేవి కొన్ని గ్రామాలు ఆయుధీయాలు గ్రామ పాలనం గ్రామికుని లేక గ్రామస్వామి లేక గ్రామ వృద్ధుల అధీనంలోవుండాలి. గ్రామంలోని వివాదాలను పరిష్కరించేందుకు గ్రామవృద్ధులతో గ్రామపరిషత్తు (పంచాయతీబోర్డు) ఏర్పడాలి పది గ్రామాలకు మధ్యగా "సంగ్రహణాన్ని", రెండు వందల గ్రామాలకి మధ్యగా "ద్రోణముఖాన్ని", ఎనిమిదివందల గ్రామాలకు మధ్య 'స్థానీయాన్ని' (రాష్ట్రనగరం) నిర్మించాలి. ప్రతి గ్రామంలోను, ఋత్విక్కు, పురోహితుడు, శ్రోత్రియులు మొదలయినవారివుండి, వారికి మడిమాన్యాలు ఇవ్వాలి అన్ని ఆపదలనుండీ రాజు జనపదాన్ని రక్షించాలి

ఒక్కొక్కశాఖకు ఒక్కొక్క అధ్యక్షుడు నియమింప బడేవాడు పణ్యాధ్యక్షుడు, కూప్యాధ్యక్షుడు, సూత్రాధ్యక్షుడు, గణికాధ్యక్షుడు, నావాధ్యక్షుడు, అశ్వాధ్యక్షుడు, హస్త్యధ్యక్షుడు, రథాధ్యక్షుడు, పత్త్యధ్యక్షుడు, ముద్రాధ్యక్షుడు, సీతాధ్యక్షుడు, సూనాధ్యక్షుడు మొదలగు అధ్యక్షులు వివిధశాఖలకు నియమింపబడి రాజ్యనిర్వహణలో పాల్గొనేవారు ఈ విధంగా రాజధానినుండి గ్రామసీమదాకా కోటి కొమ్మలతో చక్రవర్తి అధికారం రాజ్యమంతటి నలుదిక్కులకు కేంద్రీకృతంగా ప్రసరించేది

సామ్రాజ్య నిర్వహణలో పాల్గొనే రాజోద్యోగుల లంచగొండితనాన్ని గూర్చి కూడా కౌటిల్యుడు వివరించాడు రాజోద్యోగులు తమ ఆదాయాన్ని వృద్ధిపరచుకొన్నాలంచే నాడు జనపదాలను నిరంతరం పీడిస్తారని, అలా అపహరించిన ధనాన్ని తిరిగి కక్కేట్టుచేసి వారిని మరో వుద్యోగంలోకి మార్చాలని కౌటిల్యుడు చెప్పాడు "నాలుకచివర వుంచే విషాన్ని గాని, తేనెను గాని ఆస్వాదించకుండా వుండలేనట్లు, అర్థాధికారికి రాజద్రవ్యాన్ని కొంచెమైనా దొంగిలించకుండా వుండటం అసాధ్యం. నీటిలో వుండే చేపలు ఎవరికీ తెలియకుండానే నీరుతాగునట్లు కార్య నిర్వహణలో నియమింపబడే వుద్యోగులు ఎవరికీ తెలియకుండానే డబ్బును దొంగిలిస్తారు." అని అంటాడు ఆకాశాన ఎగిరే పక్షులగమనాన్నైనా తెలుసుకో వచ్చునుగాని, ప్రచ్ఛన్న భావులై సంచరించు రాజోద్యోగుల ప్రవర్తన తెలిసికొనడం కష్టతరం సమాహర్త (Collector - general of Taxes) వంటి వుద్యోగాలు చేసేవారిని రాజు నిరంతర జాగరూకతతో పరిశీలిస్తూ వుండాలని కౌటిల్యుడు చెప్పాడు ఉద్యోగులకు పెద్దపెద్ద జీతాలిస్తే లంచాలు పుచ్చుకోక, రాజ కార్య నిర్వహణలో నిమగ్నులౌతారని ఆయన అన్నాడు.

కౌటిల్యుడు పండితుడు మాత్రమే కాదు. అసాధారణమైన లౌకిక వ్యవహారానుభవం కలవాడు సువిశాలమైన మౌర్య సామ్రాజ్యాన్ని పరిపాలించేం

# భాగ్యనగర కోకిల

శ్రీ నాయని సుబ్బారావు

౧

పదిగళము లొక్క గళమై
విదిలించినగతి సుపుష్ట విస్పష్టరవా
భ్యుదయ మనోహరగానా
స్పదమూర్తివి శ్యామల ప్రభారమ్యతమా!

నీ వినద ప్రభావమహా
      నీయరహోన్నతమ్మయైన మూ
నీనది తట్టిలేప విక
      సించిన గంధమ్ము ప్రభాసితో
ద్యానవనీ బలాళికయ
      దర్శితు డతడు పేర్చు చైత్రయా
త్రానిరతిఁ వసంతు డను
      త్ప్రమదోదయ దిగ్దిగంతుడై

అన్యవనస్థలమ్ముల నచిరకాల
మున వసంతుడు తానొక్క మునగివాడు,
త్వద్దయాపోషిత ప్రాణధనుడు వాడు
నిత్యనూతన యౌవనాన్వితు డచట

నీమాయ మెట్టిదో నీ
శ్రీ మధురకలస్వనమున చిగిరించినవా
రై మరులు కొంద్రు రతియును
కాముండు వసంతమాసకలనాగరిమన్.

౨

సుర్వాపై షేర్వాణీ •
పర్వ్ చిబుకజానుయుగళ పర్యంతము, కిం
ఖుర్వాణ ధారితక చి
త్రార్వాయిత కింకిరాటు లచ్చటి తరుణుల్.

అరుదగు నీకలరవమున
కరఁగుదురే చార్ మినార్ సిగారెట్ దమ్మున్
జరదా వేసిన బీడా
పరమార్థమువారి కింకపనివలదేమిన్

పెల్యార్ ఖుర్తా వోణీ
చెల్వమ్ముల విశ్వవిజయకేళి మరుని చే
తల్వార్లు క్రొత్త ఖాదమ్
హల్వా రుచిఁ గాదనురతు లచ్చటితరుణుల్

అథవ పెసగకంటె మించుల నార్భటాలు
చలువకాటుక కడ్డిపసందు లోలయు
రెండు జడల రతిదేవు లుంచబట్టి
బ్రదికె రంగసంయుక్తులై భావభవులు

3

వారు సంస్కారశుచులైన భాగ్యవంతు
లొక్కడొక్క మహోరథ మ్మెక్కివచ్చి
చెఱువుకట్ట బెంచీపైన చెరియొకదెస
కొలువుదీర్తురు చేతిగుడ్డలను పఱచి

పకడా వేసుసెనగ పప్పెంచికొని య
టంచు నగవాలు మోహంపు తరుణి కిచ్చు,
ఆమె మదనసామ్రాజ్య పట్టాభిషిక్త
మైనరీతి హసన్ముఖయై వెలుంగు

నీవసంతాగమోన్నిద్ర నిభృతరాగ
మంజుశింజాన రమణీయ మధురగీతి
కాదు వారికి, వారు సంస్కారజడులు
వారి మోటారుహారనే వారి వీణ!

౪

కోఠి నుం టాంగుసైకిల్ మి కారుపోవు
దడదడల డబడబల సిక్కు దర్పకునకు
చెవులు పాగాంతకే సురక్షితము లతని
కేమి వినపడిచచ్చు నీ ప్రేమఘోష.

జాఫరావల్లికొనలు వాల్ జడలు రెండు
రెండు గాలికి టపటపల్ రెపరెపలుగ
అతను విజయధ్వజమ్ము నా నతని వెనుక
సీటుపై రతి కూనారి నీపాట వినును

పాటవిని కామపరవశో ద్బణము లతివ
చూపు రాకెట్లతని వీపు పొచ్చిగుచ్చి
దూసికొని ద్రోసికొనిపోయి తుదకు బయిరి
గడ్డ మాతని దోకయింత కళవళించు

౫

అదిగో మూడు చక్రాలవాహనము నీయ
విశ్వరూపదర్శన జిత విష్ణుమూర్తి,
స్వంతవాహనములు లేని జంటలకును
నరవశృంగార కేళి కాస్థానభూమి.

అతడు నారాయణుడు కాడ మహాప్రశస్త
శీధుపానాధరీకృత నీరపాణి,
కలితరథచోదనక్రియా కౌశలమున
దారుకుని మాతలిని తలదన్నినాడు.

గుమ్మటమువంటి రిక్షా
నిమ్ముగ నిలుకుకొని రతియునించువిలుతుడుగా
కమ్మని నీ కోకోల్వని
బమ్మరపోవుదు రౌకళ్ళపై నొక్కరుగా.

పరభృతకుహూనినాద సంభ్రమములు వార
లొక్కరా యిద్దరా యన్న చిక్కుపుట్టు,
పరభృతకుహూనినాద విభ్రమము సూతు
డేకచక్రమ్ముపై సివమూర్తి యూగు.

౬

ఏలోకమ్మునుండి వచ్చితివో నీ
వెందుందువో గాన వి
ద్యాలాలిత్యకళా ప్రపంచమిటు సా
ధ్యమ్మయ్యెనో నీయెడన్
త్రైలోక్య ప్రణయ ప్రసాద రచనా
ప్రత్యంతముల్ సి మహో
లీలల్ మానవవాహనమ్ములు గదా
లీలా శకుంతప్రభూ!

ఒకరాగ మ్మొకపాటగా బ్రదుకు బా
టొక్కంతయున్ దాట కం
గక సుశ్యామల కోమల ప్రభల న
య్యాటన్ తలంపింతు వీ
వౌక ప లొక్కొక్కరమ్ము నొక్కనతిగా
నూర్జస్వలాంగ ప్రదీ
ప్తి కలాప ప్రతిపాలితాఖల జగ
ద్వీథిన్ రఘూత్తంసమున్.

